# పురుష లక్షణం

people may forget what you said ,people may forget what you did,but they will never forget how you made them feel. - Maya Angelou

**Tuesday, September 7, 2010**

## O Captain Where ART thou?




సినిమా చూసేప్పుడు ముందుగా వచ్చే పేర్లలో నటీనటులు తర్వాత సాంకేతిక వర్గం పేర్లు చివరగా నిర్మాత,దర్శకుడి పేర్లు వస్తాయి(కొద్దిమంది నిర్మాతలు తమ పేర్లు చివర వచ్చేలా జాగ్రత్త పడతారు).ముందు Credits అనబడే వాటి వివరాలు,వారేం చేస్తారో (ప్రధానమైనవి మాత్రమే) చుద్దాం....
నటించడానికి నటీనటులున్నారు...సినిమాని వందరోజులు ఆడించే స్టార్స్ వున్నారు....దృశ్యీకరించే ఛాయగ్రాయకుడు... సన్నివేశాల్ని ఎడా పెడా తీస్తే ఓ పద్ధతిలో అతికించే ఎడిటర్ వున్నాడు.....సన్నివేశాలకు శబ్ధంతో ప్రాణం పోసే సంగీత దర్శకుడున్నాడు.భౌగోళిక పరిస్థితులు, వాతావరణం సహజంగా చూపించడానికి కళా దర్శకుడు ఉన్నాడు..ఇంకా ఆహార్యం , అలంకరణ......ఆటలకి.....పాటలకి.....మాటలకి....పోరాటాలకి....... ఇందరు వున్నారు...ఇంకా కథా రచయిత........ నిర్మాణ వ్యవహారాలు పర్యవేక్షించే ప్రొడక్షన్ మేనేజర్లు.....డబ్బు పెట్టే నిర్మాత..........సినిమా విడుదల చెయ్యటానికి డిస్ట్రిబ్యూటర్లు....చిత్రాన్ని ప్రదర్శించడానికి ఎగ్జిబిటర్లు.....క్యూ లో ఓపిగ్గా పేచి చూసి మరీ సినిమా బాగున్నా,లేకున్నా ఆదరించే ప్రేక్షకులు...... ఒక్కరేంటి అందరూ ఉన్నారు......అన్ని పనులూ చెయ్యటానికి వీరందరూ ఉండగా....మధ్యలో ఈ దర్శకుడు చేసేదేంటి???...యాక్షన్...కట్.... చెప్పటమేగా......ఆ మాత్రం దానికి దర్శకుడని ఓ డెజిగ్నేషన్ + రెమ్యూనరేషన్..... దండగ కదా !!!!.....సినిమా గురించి......అ,ఆ లు కూడా తెలియకపోతే లేదా మొదలు,చివర ఎక్కడో కనుక్కోలేని (సినిమా) వాళ్లకి పై వాదన సమంజసంగాను...దర్శకుడు ఓ దద్దమ్మగాను.....డబ్బులు పెట్టి లాభమో లేదా నష్టమో పొందే నిర్మాత గొప్ప దయ గల వాడు అనే అభిప్రాయం ,దాని వెంటనే ఆ జీవి మీద అంతులేని జాలి కలుగుతాయి....కదా.... ఇది ఉపరితలం.....
పెట్టుబడి రూపాయి కూడా పెట్టకుండా సినిమా క్రెడిట్స్ లో......
A Steven Spielberg film....A James Cameron film... ఇది రాంగోపాల్ వర్మ చిత్రం....A Maniratnam film... అని
పొగరుగా....కాన్ఫిడెంట్ గా....ఇది నా సినిమా...అని వేసుకోటానికి ఈ డైరెక్టర్ కి ఎన్ని దమ్ములు ,ఎంత ధైర్యం ఉండి ఉండాలి????
ఇప్పుడు....మరి ఈ వృత్తి విలువ ఏంటి? ఇప్పుడు పరిస్థితి ఎలా తయరయియ్యింది.?
అసలు దర్శకుడి అవసరం ఏంటి?..... కాస్త లోతుకెళ్లి పరిశీలిద్దాం.
1.సంగీతం (నేపధ్య సంగీతం): కథని దృష్టిలో పెట్టుకుని, దర్శకుడు చిత్రీకరించిన సన్నివేశాల్లోని భావోద్వేగాలకి అనుగుణంగా నేపధ్య సంగీతం ద్వారా దృశ్యానికి జీవం తీసుకురావటమే నేపధ్య సంగీతం.(పాటలు కూడా భావోద్వేగాల్లో ఓ భాగమే కద).

2.కూర్పు (Editing): "స్క్రిప్ట్" లో రాసిన సన్నివేశాలన్ని వరుస క్రమంలో తీయరు - Budget & Schedule Plan ని బట్టి తీస్తారు.ఒకే సన్నివేశంలో చాలా దృశ్యాలు (Shots) ఉంటాయి - కాబట్టి ప్రణాళిక ప్రకారం తీసిన వీటన్నిటిని

**Blog Archive**



**About Me**



**Aaditya Chowdary Mulpuri**

Those that know do,Those that understand teach.

View my complete profile

**My Blog List**

గురుకులం



అఖిలాండకోటి బ్రహ్మాండ నాయక రాజాధిరాజ యోగిరాజ పరబ్రహ్మ సమర్ధ సద్గురు శ్రీ శిరిడీ సాయినాధ మహరాజ్ కీ జై - ఓం శ్రీ సమర్థ సద్గురు సాయినాధాయ నమః *శిరిడీ సాయి బాబా జీవితంలో ముఖ్యఘట్టాలు*: 1.మొదట 16 సంవత్సరాల బాలుడిగా ప్రకటితమైన సంవత్సరం - 1854(వేప చెట్టు - ప్రస్తు...
*2 years ago*

ప్రకృతి & సౌందర్యం



కల్లోలం... - కలలు.. నిజం కావు ఎందుకో తెలీదు.. కల మధురం, ఐనా ఆయుష్షు అల్పమే అని తెలీదు.. తెలిసీ తెలియని వాస్తవాలే కలలై...కరుగుతాయని తెలీదు.. నిదుర లేచాక స్వప్న...

"స్క్రిప్ట్" ప్రకారం ఓ పద్ధతిలో కలపాలి.ఇది మాత్రమే Editing అనుకుంటే కత్తెర పట్టుకున్న ప్రతి ఒక్కడు Editing చేసెయొచ్చు..కాని అది మాత్రమే కాదు....Transitional devices ఉపయోగించి కథని ఇంకాస్త అర్ధవంతంగా చెప్పటం + Editing తర్వాత జత చేయబోయే సంగీతాన్ని దృష్టిలో పెట్టుకుని దర్శకుడి అలోచనని,ఊహని , ప్రేక్షకుడు వెచ్చిస్తున్న సమయన్ని గ్రహించి - వీలైనంత తక్కువ material ఉపయోగించి సాధ్యమైనంత క్లుప్తంగా కథని చెప్పే ప్రయత్నం చేయటమే కూర్పు.( Shootingలో తీసిన వాటిని మాత్రమే Edit చేస్తారు అని జ్ఞాపకం ఉంచుకోవాలి - కొంతమంది editingలో కథని మర్చొచ్చు అనే భ్రమల్లొ ఉంటారు - Script లేకుండా సినిమాలో ఒక్క పని కూడా జరగదు).

3. ఛాయగ్రహణం: స్క్రిప్ట్ లోని సన్నివేశాలకు అనుగుణంగా దర్శకుడు ఇచ్చే సూచనల్ని బట్టి -సన్నివేశ ప్రధానమైన భావం (మూడ్) + సన్నివేశాలు నెగెటివ్ మీద ప్రింట్ అవటానికి తగిన వాతావరణం సృష్టిస్తూ, దర్శకుడు ఎంపిక చేసుకున్న దృశ్యాలని సాంకేతిక నైపుణ్యంతో దృశ్యీకరించేవాడే ఛాయాగ్రాహకుడు.

సినిమా తియ్యటానికి కావలసిన కథ...స్క్రీన్-ప్లే...నటీ,నట వర్గం... వాళ్ల కాస్ట్యూమ్స్....వాళ్ల మేకప్.....సినిమా నిర్మాణానికి అవసరమైన సాంకేతిక నిపుణులు.....వారి దగ్గర నుండి తన కథకి కావల్సిన లేదా అవసరమైన ప్రతిభని “ఎంపిక” చేసుకుని,అవసరంలేని దాన్ని ఒదిలేసి...........ఓ పక్క తనకి కావలసిన విషయం వస్తుందా? లేదా? చూసుకుంటూ..........ప్రీ-ప్రొడక్షన్, ప్రొడక్షన్,పోస్ట్-ప్రొడక్షన్ ఈ మూడు దశల్లో - సినిమా గురించి అలోచిస్తూ…… అన్ని శాఖల్నీ సమన్వయం చేసుకుంటూ... సినిమాకి అవసరమైన అంశాలన్నీ ఉన్నాయో లేదో చూచే మనిషి అవసరం ఉంది అనిపిస్తుందా? లేదా?........ వివరంగా చూద్దాం.
కథా రచయిత ఉన్నాడు....ఎవరికి కథ రాయాలి? టార్గెట్ ఆడియన్స్ ఎవరు?ఆ కథ మీద ఎంత ఖర్చు పెట్టొచ్చు? దానికి న్యాయం చేసే నటీ,నటులు(నిజంగా ఉంటే)...ఏ పాత్రైనా చేయగలరు....కానీ చేసే మోతాదు ఉంటుంది కద....అదెవడికి తెలుస్తుంది?...సాంకేతిక వర్గం.....ఉదా: సంగీత దర్శకుడు ఉన్నాడు అయనకి అన్ని రకాల సంగీతం వచ్చు....ఎడా పెడా వాయించగలడు...కాని కథకి అవసరమైన సంగీతం గురించి తెలిసిన వాడు ఒకడు ఉండాలిగా.....ఛాయగ్రాహకుడ్ని ఉపయోగించుకోటానికి ఒకడు కావాలిగా.....ఏ సన్నివేశాన్ని ఎంత సేపు తియ్యాలి? ఒక దృశ్యం అవసరం ఎంత.... ఎడిటర్ స్క్రిప్ట్ లో రాసిన సన్నివేశాలకు అనుగుణంగా ఎడిటింగ్ చేస్తాడు......ఇక్కడ అతని సొంత అలోచనకన్నా దర్శకుడి ఊహని ఆధారం చేసుకుని ఎడిటింగ్ చేస్తాడు.....ఎడిటింగ్ అవగానే సినిమా అయినట్టు కాదుగా...ఇంకా సంగీతం,సంభాషణలు,శబ్ధం ఇవన్ని జత చేయాలి....కనుక….ఛాయాగ్రహణానికి ,ఏడిటింగ్ కి, సంగీతానికి ,నటనకి ,కథ లో సారాంశానికి ఉన్న అవినాభావ సంభంధాన్ని సంపూర్ణంగా అర్ధం చేసుకునే వాడు ఒకడు కావాలి కద....
సమన్వయం,నియంత్రణ....ప్రతిభ...నైపుణ్యం... అంకితభావం... ముందుచూపు..అధికారం.వీటిని ఓ క్రమపద్ధతి లో పెడదాం.... ప్రతి శాఖని సమన్వయం చేయ్యగలిగే ఓర్పు....సినిమా నిర్మాణం లోని ప్రతి విభాగం పై నియంత్రణ......ఇతరుల్లో,తనలో వున్న ప్రతిభని గుర్తించగలిగే ముందుచూపు...దాన్ని ఉపయోగించగలిగే నేర్పు......ఓ పని చేసినప్పుడు చేసిన ప్రతిసారీ ఫలితం ఒక్కోలా కాకుండా (కొన్ని మినహాయింపులతో)ప్రతిసారి ఒకే ఫలితం వచ్చేలా చూసుకునే నైపుణ్యం ...తన వృత్తి పట్ల అంకితభావం......ఇవన్నీ కలిగి ఉంటే......." ఎంపిక " చెయ్యగలగటం అనే విశేషమైన అధికారం ప్రాప్తిస్తుంది....ఉదాహరణ చూద్దాం…..

ఉదా: ఒక డబ్బున్న వ్యక్తి, తన కొడుకు పుట్టినరోజుని పురస్కరించుకుని సంగీత కచేరి ఏర్పాటుచెయ్యాలి అనుకున్నాడు.డబ్బుకి కొదవలేదు,డబ్బు పెడితే సంగీత పరికరాలు వస్తాయి...శ్రమిస్తే వాటిని వాయించే నిపుణులు దొరుకుతారు...కానీ ఏ బాణి (Tune)కి అనుగుణంగా వాటిని ఉపయోగించాలి? సందర్భానికి తగిన బాణీ ఏమిటో ఎవరు కనిపెట్టగలరు? ఇప్పుడు సంగీత దర్శకుడి అవసరం ఏర్పడుతుంది. అవునా?
సందర్భానుసారంగా బాణి సృష్టించి,దానికి అనుగుణంగా వాద్యకారుల నుండి సంగీతాన్ని ఎలా రాబట్టుకోవాలో అతనికి మాత్రమే తెలుసు...కారణం సాధన.......
అలా కాక సదరు డబ్బున్న వ్యక్తే ....ఆఁ బాణీ సృష్టించటం కూడ పెద్ద పనేనా?!!!డబ్బు సంపాదించగలిగిన వాడ్ని ఈ పని చెయ్యలేనా అనుకుంటేటేటేటే!!!!!ఏఁ జరుగుతుందో చెప్పక్కర్లేదుగా....లేదు తన మాట వినే ఓ మనిషిని పిలిచి ఈ సారికి బాణీ నువ్వు కట్టు నే! చెప్తున్నాగా...నువ్వు కట్టగలవు...అంటే?????......
(ఓ పాటకే బాణీ కట్టలేని వాళ్లు సినిమా మొత్తం ఎలా తీసేస్తున్నారో అర్ధం కావటం లేదు. పాపం కథ(దా))

సరిగ్గా ఇక్కడ ఇలాగే జరుగుతుంది...... తన డబ్బు కాబట్టి తనే ముచ్చట పడి ఓ కథ రాసుకోవటం...లేదా...తన మాట జవదాటని ఓ గొట్టాన్ని పిలిచి షూటింగ్ దగ్గర నిలబెట్టడం(సదరు గొట్టం యాక్షన్ కట్ చెప్పటంలో చాలా సినిమాల అనుభవం గడించివుంటాడు.)....సినిమా తంతు ముగించటం...లేదా ఓ హిట్ కొట్టిన దర్శకుడ్ని పట్టడం...ఆ సినిమా హిట్ కి కథో లేదా ఇతర కారణాలేవో తెలుసుకోకుండానే సినిమా ఇవ్వటం...ఇలా జరుగుతుంది......లేదా....ఇంగ్లీషు సినిమా డివిడి చూపిస్తే ఒప్పుకోవటం.... ఇది ప్రస్తుత పరిస్థితి.

సినిమా మాధ్యమం దర్శకుడిది అని గుర్తించి అతన్ని "కాప్టెన్ అఫ్ ద షిప్" అన్నారు మన సినిమా

1 year ago

ప్రణుతి



12.దత్తావధూత సమర్ధ సద్గురు నాయుడు స్వామి మహారాజ్ (లక్ష్మీ పురం, కర్నూలు జిల్లా) - నమోస్త్వనంతాయ సహస్రమూర్తయే సహస్రపాదాక్షి శిరోరుబాహవే సహస్రనామ్నే పురుషాయ శాశ్వతే సహస్రకోటి యుగధారిణే నమః మహాముని మౌన ప్రభోదాకృత దక్షిణామూర్తి వేదవేదాం...
6 months ago

భక్తి & భగవంతుడు



3/A.భగవంతుడు (ఆధ్యాత్మికం) - విఘ్నేశ్వరునికి - సరస్వతి మాతకి నమస్కారం - శ్రీ గురుభ్యో నమః గురుదేవులు సమర్ధ సద్గురు సాయినాధ మహారాజుకి, దత్తావధూత సమర్ధ సద్గురు నాయుడు స్వామి మహ...
4 months ago

భాష & భావన



స్పందన - శాంతి, స్వచ్ఛత, అణకువ, విధేయత ఇస్లాం పదానికి అర్ధం అరబిక్ పదం సలేమా నుండి పుట్టిందిది... నువ్వెక్కడ పుట్టావు.. ఎక్కడ పెరిగావు.. నీ మూలమేది.. ఈ దేశం తిండి...
4 months ago

సాహితీవనం



భావన - యుగాలు క్షణాలై కాలం గతించిపోనీ, నేను నీవను భావన, నీలో కరిగిపోనీ. - మూల్పూరి. ఆదిత...
1 year ago

Followers

Join this site
with Google Friend Connect

Members (3)



Already a member? Sign in

పూర్వికులు.అందుకే అప్పటి నిర్మాతలు సునిశిత పరిశీలన కలిగి ఉండేవారు,కాబట్టి సూక్ష్మంగా యోచించి స్పార్క్ (విద్వత్తు) ఉన్నవారికి సినిమా దర్శకత్వ భాధ్యతలు అప్పగించేవారు.....ఇప్పటి వారు జాగ్రత్తగా యోచించి స్క్రాప్(విధేయులు/చెత్త)ని పెంచి పోషిస్తున్నారు.........
కాబట్టి సోదర దర్శకులారా...దర్శకుడు అవ్వాలి అనే కోరిక మత్రమే చాలదు.....
సినిమా గురించి క్షుణ్ణంగా అధ్యయనం చేసి,అకుంఠిత దీక్షతో సాధన చెయ్యండి..ప్రస్తుత పరిస్థితుల్లో సరైన నిర్మాతలు దొరికే అవకాశం లేదు..మీ సినిమా మీరే నిర్మించుకునే దిశగా అలోచించండి.....డిజిటల్ సినిమా మేకింగ్ గురించి అవగాహన పెంచుకోండి......లేదా ముందు తక్కువ బడ్జెట్ చిత్రాలకి కథ రాసుకోండి.....హీరోల కోసం,నిర్మాతల కోసం పాకులాడకండి.....మిమ్మల్ని మీరు నిరూపించుకోండి. మంచి నిర్మాతల్ని, సాంకేతిక నిపుణులని,నటి,నటులని, అన్ని శాఖల వారిని గౌరవించండి, కాని తలవంచకండి....సినిమా దర్శకుడి మాధ్యమం అని తెలియజేయండి.
ప్రేక్షకులకి మంచి చిత్రాలు ఇవ్వండి.మనం ప్రేక్షకులకు మాత్రమే జవాబుదారి......ఇక్కడ ఇంకెవ్వడికి తల వంచక్కర్లేదు....
శుభం.

మూల్పూరి.ఆదిత్య చౌదరి.
(greenlong2498@gmail.com)

Posted by Aaditya Chowdary Mulpuri at 4:53 PM 

Recommend this on Google

## No comments:

## Post a Comment

Enter your comment...

**Comment as:** Aaditya Chowdary Mulpuri (Google) Sign out

**Publish** Preview Subscribe by email

## Links to this post

Create a Link

Newer Post Home Older Post

Subscribe to: Post Comments (Atom)

